# కొరోన వారణార్థనా పద్యపంచాశిక



వైద్యో నారాయణో హరిః

**కవితా ప్రసాద్**

# శ్రీ శీతలా దేవి అష్టకమ్

అస్యశ్రీ శీతలాస్తోత్రస్య మహాదేవ ఋషిః అనుష్టుప్ ఛన్దః
శీతలా దేవతా లక్ష్మీ ర్బీజమ్ భవానీశక్తిః సర్వ విస్ఫోటక
నివృత్త్యర్థే జపే వినియోగః

**ఈశ్వర ఉవాచ:**

వన్దేఽహం శీతలాం దేవీం రాసభస్థాం దిగమ్బరామ్ ।
మార్జనీకలశోపేతాం శూర్పాలంకృత మస్తకామ్ ॥ 1

వన్దేఽహం శీతలాం దేవీం సర్వరోగ భయాపహామ్ ।
యామాసాద్య నివర్తేత విస్ఫోటక భయం మహత్ ॥ 2

శీతలే శీతలే చేతి యో బ్రూయాద్దాహ పీడితః ।
విస్ఫోటక భయం ఘోరం క్షిప్రం తస్య ప్రణశ్యతి ॥ 3

యస్త్వా ముదకమధ్యేతు ధృత్వా సంపూజయే న్నరః ।
విస్ఫోటకం భయం ఘోరం గృహే తస్య న జాయతే ॥ 4

శీతలే జ్వర దగ్ధస్య పూతిగంధయుతస్యచ ।
ప్రనష్టచక్షుషః పుంసః త్వామాహుర్జీవనౌషధమ్ ॥ 5

శీతలే తనుజాన్రోగాన్ నృణాం హరసి దుస్త్యజాన్ ।
విస్ఫోటక విదీర్ణానాం త్వమేకాఽమృతవర్షిణీ ॥ 6

గలగండగ్రహా రోగా యే చాన్యే దారుణా నృణామ్ ।
త్వదనుధ్యాన మాత్రేణ శీతలే యాన్తి సంక్షయమ్ ॥ 7

(మిగతా వెనుకఅట్ట లోపలివైపు)

**కొరోన వారణార్థనా పద్యపంచాశిక**

ప్రార్థకుడు: కవితా ప్రసాద్



**ప్రథమ ముద్రణ**: జులై 2021

**కాపీలు**: 100

**ప్రచురణ**: **కళాగౌతమి**, రాజమహేంద్రవరము

**ప్రాప్తిస్థానం**: Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
✆: 9490168907

**వెల**: అమూల్యము

**డిజైన్ & డి.టి.పి.**: పంతుల విట్టుబాబు, హైదరాబాద్, ✆85550 82034
**ముద్రణ**: ముద్రికా ప్రింటర్స్, విజయవాడ, ✆94401 59456

## డా. బులుసు వేం.స.మూర్తి
"కళాగౌతమి" వ్యవస్థాపకులు
"శ్రీకళాగౌతమి" సంపాదకులు
రాజమహేంద్రవరము
పిలువు. 9866290025

# అభినందనము

**క**వితా ప్రసాద్ గారు పద్యకవిగా మనకందరికీ సుపరిచితులే. ఒక తీరని ఆపద వచ్చినవుడు ఎవరు రక్షిస్తారో తెలియదు కనుక అందరి కాళ్ళు పట్టుకుని బ్రతిమాలడం సహజంగా జరుగుతూ ఉంటుంది. అలాగే ఇందులో నీ నా భేదం లేకుండా అందరినీ నతీపతులతో సహా ఈ కొరోనాను అరికట్టమని ఛందోబద్ధంగా వేడుకోవటం జరిగింది. పేరులోని 'వారణార్థనా' అనడంలోనే ఉపసర్గలను తొలగించిన సూచకంగా కొరోన తొలగాలని కోరుకోవటం వారి మనోభీష్టంగా వెల్లడౌతోంది.

'కందమన్న మాకు కరతలామలకమ్ము' అన్నట్టుగా అన్ని పద్యాలూ కందంలోనే అందంగా సాగాయి. అందులో కొన్ని సామాన్యంగా వాడుకలో లేని పూర్వకవి పదప్రయోగాలు కనిపిస్తాయి. 'ముద్దయ్య= కుమారస్వామి; ప్రఘన=రాక్షస; జాయువు=ఔషధము; జేఱబి=అసతి' లాంటివి. "నరకేశరి", "తెలతు" వంటి అరుదైన పద ప్రయోగాలున్నాయి. ఇక "నక్రగత శనైశ్చర" అని వర్తమాన గోచార శనిని ప్రార్థించుటలో తన జ్యోతిషశాస్త్రాభిజ్ఞానమును కూడా సూచించారు.

ఇలా ఈ కొద్దిపాటి పద్యాలలోనే తన వైదుష్యాన్ని ప్రకటీకరిస్తూ నేటి కొరోన సంక్షోభాన్ని నివారించమని తన స్వస్థల గ్రామదేవత లంకమ్మనూ, మన రాజమహేంద్రి నగరంలోని సోమాలమ్మనూ కూడా శరణు కోరి జనసౌభాగ్యాన్ని ఆకాంక్షించిన కవితా ప్రసాద్ గారికి మనసారా అభివందనములు. వారి యీ గ్రంథగత మనోభీష్టము నెఱవేరాలని, వారి ఇష్టదైవము వారికి సమస్త శుభాలు చేకూర్చాలని ఆశీర్వదిస్తున్నాను.

రాజమహేంద్రి.
07.05.2020

**బులుసు వేం.స.మూర్తి**
"కళాగౌతమి"

# అభివాదము

ప్రస్తుత ప్రపంచ పీడ "కొరోన" విపత్తునుంచి లోకాన్ని బయట పడవేయమని అనేక దేవతామూర్తులను ప్రార్థించుటయే యీ పద్యసమాహారాంశము. మన శాస్త్రములు ఔషధసేవనముతో పాటు భగవదారాధనను కూడా రోగనివారణకు మార్గముగా నిర్దేశించినాయి. అది మనకు విహితకరము. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి". నావంటి అల్పకవికి నైక సగుణరూపాత్మక పరమాత్మను ఎన్ని పద్యాలతో ప్రార్థించ శక్యమౌతుంది? త్రిమూర్తులను, వారి పరివారమును, ఇంద్రుని, కొందరు దిక్పాలకురను, విష జ్వరాది రోగనివారిణి ఇంద్రాక్షిని, విపత్తులను నివారించే గ్రామదేవతలను, కొన్ని పరాశక్తి రూపాలను, రోగకారకుడు, ఆయుష్కారకుడైన శనైశ్చరుని అలా తోచిన రీతిలో కొన్ని దైవత రూపాలను ప్రార్థించడమైనది. ఈ పద్యాలను పఠితలు చదువుట వలన కలిగే ప్రయోజనం ఏమిటి? నాతో పాటుగా వారూ లోకక్షేమం కోసం ప్రార్థించినవారౌతారు. ప్రార్థనకు మహత్తరమైన శక్తి ఉంది. సన్మనస్కులైన పఠితల ప్రార్థనకు భగవచ్ఛక్తి తప్పకుండా అనుకూలిస్తుందని నా విశ్వాసము.

ఈ పంచాశికకు "అభినందనము" నొసగిన సౌహార్ద సాహితీ శ్రోత్రియులు శ్రీ బులుసువారికి హార్దిక ప్రణామ ద్విపంచాశికను సమర్పిస్తున్నాను. నెరసులు దొర్లని రచనలు దుర్లభము. నావంటి అల్పధీమతి విషయంలో అది నిత్యసత్యము. రసజ్ఞులు పానకంలో పుడకలను పట్టించుకోనట్లు, పంటిక్రింద రాయిని కూడా పటికబెల్లపు ముక్కలా భావించు కవిత్వప్రేమికులు మీరందరూ అని నా విశ్వాసము.

నారాయణ కృపతో, వైద్యనారాయణుల కృషితో యావత్ ప్రపంచము శీఘ్రముగా యీ కొరోన ప్రాణగొడ్డము నుంచి విముక్తమవుగాక!

రాజమహేంద్రవరము **– కవితా ప్రసాద్**

07.05.2020

# కొరోన వారణార్థనా పద్యపంచాశిక

శ్రీ విఘ్నేశ్వర! కావఁగ
రావయ రయమున కొరోన రాక్షస కృమిభీ
తావహ జగతిని! శరణము
నీవే కద మాకభయము నిచ్చెలు నిడుమా! 1

నందీ! నీ పదఘట్టన
మందీ ఘాతిని నొక పరియాయము నొక్కన్
డిందుఁగదా నీ గిట్టల
క్రింద నలుంగుచుఁ! గొరోన క్రిమిని దునుమవో! 2

ముద్దయ్యా! పాఱెను సరి
హద్దులు మీరి ధరణి విలయ కరమ్మై చె
స్మద్దురితరూపమై కొవి
డిద్దాని న్మట్టుపెట్టు మీటె మెఱముచున్ 3

హర వీరభద్ర! లేవీ
కొరోనకుఁ దలయును దోక కోయగ నెంచేన్!
నురియుంచి దీని నీచి
చ్చేరకంటి కనుకలి రక్ష సలుపగ రావే! 4

శరభస్వామీ! నరకే
శరిసమ భయకృత్కొరోన జనమృత్యుభయం
కరమై పైఁబడె! మరియొక
పరి వచ్చి కొరోన ప్రగతి వారింపుమయా! 5

కైలాసపతీ! కుత్తుక
వ్రేలాడు హలాహలమును విసరి కొరోనా
పై లవ లేశము, దానిం
గూలఁగఁ జేసి మము నాదుకొనరావయ్యా! 6

మారీ! భువిఁ బట్టె మహా
మారి కొరోన కృమి! జనుల మారణ హాహా
కారములు పెరిగె! నీహుం
కారమ్మొకటి సరి దానిఁ గడపఁగ దుర్గా! 7

సర్వవ్యాధి ప్రశమని!
శార్వరి! సమయింపుమీ విష కొరోన నిఁకన్
నిర్వాణమ్ముల నాపుమ
యుర్విం గరుణార్ద్రదృశలనూని జగతిపై! 8

మాతా! కాళీ! కనుమా
మా తిప్పల నీ కొరోన మారికృతములన్!
ఏ తీరున నెఱఁ గుశలముఁ
జూతువొ? మహిషాద్యసుర నిషూదిని మమ్మున్! 9

అమ్మా! అవనీపుర లం
కమ్మా! స్థలదేవతా! నిరామయ మిమ్మా!
మమ్మాదుకొనఁగ రమ్మా!
క్రమ్ముకొనిన యీకొరోన లయమొనరుపుమా! 10

సోమాలమ్మా చూడ
మ్మా! మానవ లోకసంక్షయకృమి కొరోనన్
నీ మహిమం దెగటార్చి ని
రామయ మొనరింపుమమ్మ యఖిల జగంబున్! 11

చండీ! కొరోన యొక పెను
గండమ్మై పొలయుచుండెఁ! గాఁపాడవొ యీ
దుండగురాలిని వేళమె
ఖండించి సమూలముగఁ బ్రఘనసంహర్త్రీ! 12

హే వైనతేయ! ఉగ్రా
శీవిషవితతులను జీల్చి చెండాడెడు నీ
కీ వెడ కొరోన లెక్కా!
రావే నిర్మూలపఱచి రక్షింప వెసన్ 13

కరిరాజవరద! భీషణ
కొరోన సూక్ష్మకృమివలన క్షోభిలుచుండెన్
ధర! నీ చక్రాయుధమొక
పరి దానిన్సంహరించేఁ బంపగరాదో! 14

క్షీరాబ్ధిసుతా! కోవిడు
బారిం బడి యతలకుతలపడె మా బ్రతుకుల్!
ప్రారబ్ధవశ విపత్తు ని
వారింపుమ శీఘ్రముగను బ్రకృతీ! వికృతీ! 15

రాకలు పోకలు నిలిచెను!
వ్యాకుల మతులైరి వ్యాధిభయ విహ్వలతన్
లోకులు! కొరోన రోగము
సోఁకగ నాపుమికఁ దమ్మిచూలి నరులకున్ ! 16

కొలువులు వోయెను! విద్యా
ర్థుల చేదువులు వోయెనీ కొరోనవ్యాప్తిన్!
ఫల మే పాపమున కిదో!
పలుకుఁజెలీ! దాని నడఁపి పాపుము బాధన్! 17

ప్రణతులు రామా! నీవొక
తృణమును విసరినఁ గొరోన కృపణముపైఁ దత్
క్షణమే కాకము వోలె మ
రణించుఁగాద! తడవేల రక్షింపనయా! 18

అతులిత బలధామా! మా
రుతసుత! లంకిణిఁ బిడికిలి గ్రుద్దున పరిమా
ర్చితివట! కొరోన లెక్కా
హతమొనరుప! నడఁచి మమ్ము నాదుకొనవయా! 19

అరయము పూతనఁ జెంపుట!
గొరోనఁ బోకార్చి యాదుకొని నీమహిమన్
ధరఁ దెలియం జేయు మిపుడు
మురమర్దన! జనకలవరముం బాపుమయా! 20

కలినిన్ వేంకట నాయకుఁ
డిల శరణంబని కదా నుడివెను బురాణం
బులు! కరుణాజాయువిడి ప్ర
జల కాయువుఁ బోయరావొ జలజాసపదా! 21

అమ్మ! అలర్మేల్మంగ! యు
రమ్మున వేంకటపతికి విలాసకలన! యీ
ఱొమ్ముతెవులిడు కొరోనను
వమ్ముపఱచి మమ్మునోము భారము నీదే! 22

సింహాద్రీశ నృకేసరి!
సంహారము సేయవయ్య జేఱభి కొరోనన్!
సంహృత కనకకశిప! నఖ
సంహృతి పంజా నొకపరి సారించేవయా! 23

షిర్డీ సాయీ మహరాజ్
దుర్దినములు దాపురించె! తోయజచరణా!
మర్దించి కొవిడ్ నైన్టీన్
హార్దముగా నీ జనక్షయమునాఁచేఁగదే! 24

ఆరోగ్యద ధన్వంతరి!
సారభిషగ్వర! నుడుగది సత్యము "వైద్యో
నారాయణో హరిః" అన!
యీ రోగ కొరోనఁబాప నీయుము టీకా! 25

శరణమ్మో అయ్యప్పా
శరణము! పాలకొఱకీవు శార్దూలము లోఁ
బరచేకొనిన ఘనుఁడవు క్రిమి
కొరోన నట్లే క్రమించి కూల్చుము సామీ! 26

క్రోడావతార! వినుమా
గోడు! కొరోనక్రిమి కఱకు కోరలతోడన్
దాడిని చేసెను మాపైఁ
బీడను తొలగింపరమ్మ పృథ్వీభర్తా! 27

ఉరమున నాఁటుకొని నరుల
కు రోగమంటించు చుండె కోవిడ్ నైన్టీన్
నరుకుము భార్గవరామా!
కొరోన రక్కసిని గండ్రగొడ్డలి పెట్టున్! 28

వామనదేవా! కోవిడ్
మా మానవజాతినెల్ల మణఁగించేంగా
నీమము వహించె! బలిగతి
నీ మారినిఁ ద్రొక్కి మమ్ము నేలుకొనవయా! 29

అన్నవరంపు దేవా! ఆ
పన్నుల మైతిమి కొరోన పట్టి! దయాసం
పన్న! విరాళి నిను దెలతు!
దన్ను నిలచి మము ప్రసన్నతం గావవయా! 30

అనఘా దత్తాత్రేయా!
వినాశకరమై కొరోన పెనుమంద్రాటం
బును గలుగంజేయుచున్నది
ఘనత్రిమూర్త్యాత్మక! తడకట్టుమ దీనిన్! 31

యమధర్మరాజ! నీ పా
శమేమొ యనురీతి కొవిడు జనులనసంఖ్యా
తముగా బలిగొనె! దాక్షి
ణ్యమ్మును జూపుమిక దక్షిణదశాధీశా! 32

ఆరోగ్యదాత సవితా!
సారింపుము త్వత్కృపాదృశల ధారుణిపై
వారించుమీ కొరోన ప్ర
చారము వరమిడుము మాకు జాడ్యపులేమిన్ 33

సకలౌషధీరసోత్ప
త్తికరా! సోమా! కొరోన తెవులుకుం దగు మం
దొకటేదియు లేకుండెను!
వికృతికిం బ్రతిహతి నొనర్చు భేషజమిమ్మా! 34

నక్రగత శనైశ్చర! నీ
దౌక్రూరేక్ష నరసురులకఋమఁగ వసమే!
వక్రి కొరోన నతకడచి
సక్రమ పరపుము బ్రతుకుల ఛాయాపుత్రా! 35

నీపయి భారమ్ము పెరుఁగ
నీపగిది కొరోన సాయమెంచితివా స్వసూ!
నీపతి రాననెనో సం
తాపముఁ బోకార్చఁ! జోలు దడకట్టుమిఁకన్! 36

హయకంధర! ధీవర్ధక!
రయమున పరిశోధకుల గురణముల్ సఫలం
బయి కోవిడ్‌నకు శాశ్వత
నియంత్రణపథ మొకదానినిఁ గనపరపుమా! 37

ఆగ్నిముఖీ గాయత్రీ!
భగ్నమొనర్పవా కొరోన వలనఁ గలిగెడున్
రుగ్ణత! నవ్యాజ దయా
మగ్నహృదయినీ! కమల్చుమా సూక్ష్మకృమిన్! 38

కోవిడు నైన్టీన్ తో మా
జీవన సాధారణగతి చెల్లాచెదరై
బావురు మంటిమరయ రా
వే వైకుంఠదళనాథ విష్వక్సేనా! 39

మాతా ఇంద్రాక్షీ! నీ
కే తూలింప నలవియవు నీ నవమారిన్
వీత రుజాభయదాయిని!
భీతావహ భూతలము నపేక్ష నరయుమా! 40

సకల విషజ్వర కృచ్ఛ్ర హ
ర కృపామృతహృదయ శీతలామాతాఖ్యా!
పెకలించి కొరోనను మ
మ్ము కావగా రావె వైళము రుజాశమనీ! 41

గురురాఘవేంద్ర! ప్రేతం
పురూపు నాలికిఁ గరుణను బోనాడిన మం
త్రరహస్యవేత్త! కోవిడ్
మరులును సదమదము సేసి మమ్మోమవయా! 42

దునుముము శక్రా! మనుజా
సన సూక్ష్మకొరోన పై విసరి దంభోళిన్!
మననీయుము నరజాతిని
ల! నరులు సురహితులవుటను రక్షింపఁగదే! 43

పృథివిని మోచెడి భారం
బధికంబాయెన యనంత! పంపితివేమో
వధియింపఁ గొరోన మమున్!
విధించినది చాలు శిక్ష! వెతఁ దేర్చవయా! 44

పురుహూతిక శక్తీ నీ
చరణమె శరణమింకమా కశక్తులమమ్మా!
బిరమున హుంకారిణివై
కొరోన రూపఱచి యేలుకొమ్మా సంతున్! 45

నతియింతుఁ గుక్కుటేశ్వర!
మితిలేని విజృంభణమున మృత్యుప్రదమౌ
యతిచర కొరోనకృమి వి
స్తృతి నరికట్టుమ గయాసురేంద్రనిహంతా! 46

పావక! కార్చిచ్చుగ నె
న్నో వనములఁ గాల్చితివయ యూరకయే! యీ
కోవిడు నైన్టీన్ దవులిచి
భూవాసుల మన్ననఁ గొనవో! హితశుచివై! 47

కడకడఱేడా! కడు గడ
బిడ యయ్యె నరుల బ్రతుకుల! వీటి గడపనుం
గడవఁగ దడయవు! మా కే
డ్గడగ నిలఁబడుమ పొనుఁగుపడఁగఁ గోవిడిలన్ 48

వరగౌతమీధునీ పు
ష్కరశరసుస్నాత శుద్ధజనవాసంబౌ
పురరాజమహేంద్రిఁ గవిసెఁ
గొరోన! వరుణా! తగునొకొ! కుశలంబిడుమా! 49

కలవు కలవంచు నినుభ
క్తులిల మతాతీతసన్మతులయి కొలిచెదున్
ప్రలయ సదృశమౌ కోవిడు
ను లయమొనర్పఁ బరమాత్మ! నూకుము వేగన్! 50

ఎందరొ వైద్యులు సేవకు
లుం దమ క్షేమవిషయమె తలుపక రవంతన్
డెందములో, దైవమ్ముల
చేందమున శ్రమించే చుంద్రి! చేలిపెద నతులన్! 51

దైవప్రార్థన సలుపగ
నావశ్యక మౌషధ గ్రహణానుగతికమై!
కావలయు రెండును మనకు
దైవానుగ్రహము లేక తఱకునె సెఱగుల్! 52

-- :: సమాప్తం :: --

# శ్రీ శీతలా దేవి అష్టకమ్

నమన్త్రోనౌషధం తస్య పాపరోగస్య విద్యతే ।
త్వామేకాం శీతలే ధాత్రీం నాన్యాం పశ్యామి దేవతామ్ ॥ 8

మృణాల తంతు సదృశీం నాభి హృన్మధ్య సంస్థితామ్ ।
యస్త్వాం సంచింత యేద్దేవి తస్య మృత్యుర్నజాయతే ॥ 9

అష్టకం శీతలాదేవ్యా యోనరః ప్రపఠేత్సదా ।
విస్ఫోటక భయం ఘోరం గృహేతస్య నజాయతే ॥ 10

శ్రోతవ్యం పఠితవ్యం చ శ్రద్ధాభక్తి సమన్వితైః ।
ఉపసర్గ వినాశాయ పరం స్వస్త్యయనం మహత్ ॥ 11

శీతలే త్వం జగన్మాతా శీతలే త్వం జగత్పితా ।
శీతలే త్వం జగద్ధాత్రీ శీతలాయై నమోనమః ॥ 12

రాసభో గర్దభశ్చైవ ఖరో వైశాఖనందనః ।
శీతలా వాహనశ్చైవ దూర్వాకంద నికృంతనః ॥ 13

ఏతాని ఖరనామాని శీతలాగ్రేతు యఃపఠేత్ ।
తస్యగేహే శిశూనాం చ శీతలా రుఙ్నజాయతే ॥ 14

శీతలాష్టక మేవేదం నదేయం యస్యకస్యచిత్ ।
దాతవ్యం చ సదా తస్మై శ్రద్ధా భక్తియుతాయవై ॥ 15

ఇతి శ్రీస్కాన్దపురాణే శీతలాష్టకం సంపూర్ణం



# కవి పరిచయం

**రచయిత:** కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్

**జననం:** 1955

**ఊరు:** అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర)

**తల్లిదండ్రులు:** వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ,
రాజ్యలక్ష్మి.

**చదువు:** MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD)
స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము).

**వృత్తి:** D.G.M (retd.), ONGC.

**అభినివేశము:** పద్య, వచన కవిత్వములు, కథారచన,
వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు.

**రచనలు:** వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు,
ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు,
వివిధ కవితా సంకలనములలో రచనలు.

**గ్రంథములు:** శ్రీ రాజశేఖర శతకము,
శ్రీ వేంకటేశ్వర ద్విశతి,
కొరోన వారణార్థనా పద్యపంచాశిక
కావవే కామేశ్వరీ!! (శతకము),
ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి),
మాటవెలదులు (పరశ్శతకము),
ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),
ఇష్టకథాష్టకము (కథాసంపుటి),
ముహూర్త కామేశ్వరము. మొ.